## మా కృతులు

| | | |
|---|---|---|
| ఆత్మకథ ౨ భా. | రు | ౭—౦—౦ |
| రాష్ట్రగానము | రు | ౧—౦—౦ |
| ధర్మజ్యోతి | రు | ౧—౦—౦ |
| అమరజ్యోతి | రు | ౦—౮—౦ |
| పెద్దకాపు | రు | ౧—౦—౦ |
| ఆత్మార్పణము | రు | ౧—౦—౦ |
| తపస్సిద్ధి | | ఉచితము |
| పత్రిగపంట | | అచ్చులో |


తుమ్మల సీతారామమూర్తి చౌదరి
బోర్డుహైస్కూల్ పండితుఁడు
అప్పికట్ల (గుంటూరు జిల్లా)


# ఆత్మార్పణము




అభినవ తిక్కన
తుమ్మల సీతారామమూర్తి చౌదరి





ప్రకాశకులు :
రామమోహన గ్రంథమాల
యనమలకుదురు - విజయవాడ

మొదటి కూర్పు ౧౯౩౭
రెండవ కూర్పు ౧౯౫౦
వెల రు ౧—౦—౦

భారతీ ప్రెస్, తెనాలి, 1950

# నివేదనము

ఆది విభవసంవత్సరము. వడకారు. మునిమాపు. నెయ్యురతో నూరి వెలుపలిపచ్చికబయళ్లలో నా యసివాఱు. మేము ముచ్చటలలో మునిఁగి తేలుచుంటిమి. మాయెలమి సోడు ముట్టుచున్నది. ఇంతలోఁ జెంత నున్న మావిగున్నపైఁ జెరలాడు పెంటిగువ్వ నొకయెఱుకు దంట — కంటితడి యెఱుంగని మొండికట్టె వాఁడికట్టెయం బఱపి తనపొట్టం బెట్టుకొనె. కట్టా! యని మే మట్టె లేచితిమి. ఘోషించితిమి. రోషించితిమి. దూషించితిమి. మే లే మున్నది? రిత్తకు రిత్త.

తోడ్తోఁ దిక్కనార్యుని "లుబ్ధకపోతోపాఖ్యానము" మా తలఁపునం బాఱె. "ఈపిట్టకథకు వలయుమార్పులు చేర్పులుం గూర్చి యిట్టి కట్టెఁడితనంబుపై జనంబులకు నేవగింపు వొడమ నీ వొకకబ్బంబు నుడువు మెంతయు లెస్సగదా" యని నెచ్చెలికాండ్రు న న్నెచ్చరించిరి. ఆ యావేశములో నాదిటవులేమి న్మఱచి యే నందుల కియ్యకొని యపుడ గ్రంథారంభ మొనరించితి. వాణీకటాక్ష బలంబున నలఁతి ప్రొద్దునకే యీకృతి నిట్లు సంతరింప నయితి యైనది. ఇందు మాకోరుకు లెంతవ ట్టీడేఱెనో చదువరులకే యెఱుక.

ప్రాచేతసుని రామాయణరచనకుంబోలె నా యీ చేఁతకు విషాదజనక మగు నిషాదచేష్టితమే మూలకారణ మనిన నౌపమ్యసూచనలో నధికోపమాదోష మున్న దని

యాలంకారికు లపహసింతురు గాఁబోలు. కానిండు. ఎవరిబిడ్డ వారికి ముద్దు.

ఇయ్యది ముగియుటయే తడవుగ భారతీపత్రికలోఁ దత్సంపాదకుల యాదరాతిశయమ్మున ముద్రిత మగుటంజేసి తెలుఁగుమాగాణములో నెంతేని వ్యాప్తి నందుభాగ్యము వడసినది. దేశోద్ధారకుని యీయుపకృతి మఱవఁజాల.

ఎసలిక యసదై యున్నను దల్లిపలుకుపైఁ గలతగుల మునంజేసి వేసట నాక దీనికిఁ దగుప్రస్తావన వ్రాసి యిచ్చిన ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ. గారికిఁ గృతజ్ఞతాపూర్వకములు కేలుమోడ్పులు.

తెలుఁగు వారీ కృతికిఁ బ్రేమపూర్వక స్వాగతము పల్కి యితోఽధికభాషాసేవకు నన్నుఁ బురికొల్పుదురు గాత!

౧-౫-౩౨ —రచయిత

# ప్రస్తావన

"కలదే యిమ్మెయిపౌరుషంబు జగతిన్ గారుణ్య మేపార ని
ష్ఫలుఁ గిట్టిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపన్ వచ్చిన నింత కీడగునె యేతత్క్రూరతా ఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షి గురువై సంధించె సద్బోధమున్

—కవిబ్రహ్మ

కథ ఒకదివసము, ఒకరాత్రిలో సమాప్తమైనది. 'అక్కటికంబు లేనికలుషాత్ముఁ డొకానొకబోయవాఁడు' వేకువను వేఁటకు బయలుదేరుచున్నాఁడు. రాత్రి ముగియుసరికి 'పావన దేవత్వంబు వడసి వన్నియకెక్కె'న వాఁడైనాఁడు. వేకువను బోయ 'ధనుశ్శాతాశుగవాగురాదిసాధనుఁ డగుచు' వేఁటకుఁ జనినాఁడు. 'అహస్కరుఁ డేపున నడిమింట మండు నెండలఁ గాయు' సరికి ఆతని 'కలుషహింసావ్యాపార' మగ్గలమైనది. మఱి 'రెండుగడియలకాల' మునకు మిన్నెల్ల నీలమేఘచ్ఛన్నము. 'అబ్జబాంధవుఁ డస్తమించు' సరికి వాన, వంగుడు, ఈదర, ఇవము. 'కొంతవడి కజ్జడి మెల్లన తగ్గె'. ఇక్కడి నుండియే కథయొక్క నిగ్గు.

మూఁడే పాత్రలు. బోయఁడు, కపోతము, కపోతి. బోయని మనఃపరిణామ ప్రదర్శనముపైనే ఈ కావ్యమునందలి కళ ఆధారపడి యున్నది. ఱాగుండెనైనఁ గరగింపఁజాలు పరిస్థితులు. 'దుర్గమారణ్యము' 'అదిగాక దుర్దినంబు'

‘వెండియుం జడివాన’ ‘పైపెచ్చమాస’ ‘అన్నిటికిఁ దోడు ఆఁకలిబాధ’. ‘అక్కఱకు ఱెుఱుకుదొర’ యుల్లంబుకూడఁ దల్లడిల్లినది. అయినను

‘ఇచ్చనచ్చినపుల్గు వ్రచ్చి వెచ్చనిపచ్చి
పొలసు మెక్కెడుగీత తొలఁగు నెక్కొ’

అనియే ఆతనిచింతనము. ‘జీడిమామిడిపప్పు’ ‘కల్సారాలు’ ‘కూర్మిబిడ్డ’ ‘ప్రియురాలు’ వీని యన్నిటి కంటె ‘పచ్చి పొలసు’నే ఆతఁడు తొలుతఁ బేర్కొనినాఁడు. కాని యంతలో ఆతనిమనము క్రమపక్వమునకు రా నారంభించినది. ‘ఇన్ని కంతులు కోసితిని గాని నా కంతి యంత నొప్పిలేదు’ అను తత్త్వములోనికి వచ్చినాఁడు. తనదృష్టితో నితరులను గాంచు ఈ క్షుద్రగుణమును గూడ నాతఁడు త్వరలో విడనాడఁగలిగినాఁడు. ‘పాపపుంద్రోవలఁ ద్రొక్కి మిమ్మెపుడుఁ ద్రుంచు దురాత్ముని నన్ను నిట్లు సంభావనచేసి మంతే’ అని పక్షితో నని ఇతరులదృష్టితోఁ దన్ను చూచుకొనుటతో నాతని హృదయపరివర్తనము పూర్తినొందినది. తనకుఁగాఁ బక్షి మంటఁ బడుట చూచి—

“లోకు లీకరణిం బ్రాణిలోకమునకు
మేలు గావించుచుంద్రు కాఁబోలు సతము
పుట్టువుం దొట్టి యుపకృతిపొంతఁ బోని
కట్టిఁడిని నేను నా కెట్టిగతులు గలవొ”

అనుటతో నాతఁడు ప్రాణములతోడ జన్మాంతరము నొందినాఁడు. ఇఁక నాతని జన్మాంతరము సంగతి తడవనేల! బోయఁడు కథలోఁ దొలుత ప్రవేశించుచున్నాఁడు. తుదిని నిష్క్రమించుచున్నాఁడు.

కపోతము రెండవ పాత్ర. అర్ధాంగియెడ ఈతని అనురాగము అవధియెఱుఁగనిది. భారతదేశకావ్యములందు భర్తల కొఱకు విలపించిన భార్యలు పెక్కురుగలరు; భార్యలకొఱకు విలపించినభర్తలు మిక్కిలి తక్కువ. ప్రమద్వరకొఱకు రురునివలె నీకావ్యమునందలికపోతము కపోతికొఱకువిలపించు.

“కలిమిలేములలోన భాగంబుఁ గొనుచు
మంచిచెడ్డలలోనఁ బా ల్పంచుకొనుచు
మెలఁగునర్ధాంగి దూరమై తొలఁగెనేని
మగని కాధార మెవ్వరో మగువ! చెపుమ”

మగువ మగని కాధార మనిన ఈ మగపిట్ట తనభార్యయందు దేవీస్వరూపమును గాంచుటలో ఆశ్చర్యము లేదు. అతిథిసేవలో కపోతమునకు కపోతి ఉపదేశకర్త్రి. వానకారున కట్టెలు లేకపోఁగా నిల్లు పడఁగొట్టించి యింటిదూలములు చీల్పించి వంటలు చేయించి సంతర్పణములు సాగించినమహాదాత కర్ణునివలె నీకపోతము గూఁటిచితుకులను బోయవాని చలిమంట కిచ్చినది. ఇట్లు వానిచలిమంటకు గూఁటిచితుకుల నిచ్చుటలో లెక్కయేమి? వానికడుపుమంటకుఁ దానే బలివోయెనుగదా! అతిథిసేవకు భార్యవలన ఆదేశము నందిన

యీ ఆదర్శకభర్త తాను అగ్నియందు దుముకుటకును భార్య ఆదేశము నర్థించినాఁడు.

"నీ సహాయత లేక నాచేసినట్టి
గట్టికర్జ మొకండేనిఁ గానఁబడునె ?"

అని బ్రతికియున్నపుడు కపోతము కపోతినిగూర్చి అన్న మాటలు.

కపోతి మొదటినుండి తుదిదాఁక భారతసతీత్వము గుబాళించుపాత్ర. మగఁడు తన్నుఁగూర్చి యనినవాక్యములు వాగురాబద్ధయై విని కపోతి పొందినసంతోషమునకు మితిలేదు.

"మగనినెమ్మదికి నిమ్మాన్మడ్కి నెక్కుటయకా
కులకాంత సతతంబుఁ గోరుచుండు
నింక వలసినదేమి నా కీభవంబు
సార్థకత చెందె దుర్గతిప్రాప్తి దప్పె"

ఉసురులు తొలఁగువేళ తలఁపని తలంపుగా మగనిదర్శనము దొరకినందులకు కపోతి ఆర్తజనబాంధవునకు జోహారొనర్చినది. కపోతికి భారతాంగనకువలె దాంపత్య మెడతెగనిది; ఉత్తరలోకము కలదు; వైరాగ్యభావము హెచ్చు; 'దుఃఖమన్ వాకిలి మూయుటకు ధైర్యకవాటము' కలదు. ఈ కపోతి స్త్రీహృదయము బాగుగాఁ బ్రదర్శించు వాక్యములు—

"మగఁడు నేఁడురాక మసలెనదేమొకో
దైవమా ! యటంచుఁ దల్లడిల్లి
యెఱుకు నింతి యింట నెల్లెడ్చు చున్నదో
జాలి గొల్పు వీనిచరిత మకట !"

ఆడుదాని కష్టము ఆడుదానికిఁ దెలియును. తనపుత్రులను చంపిన అశ్వత్థామను పట్టితెచ్చి యెదుటనిలుప ద్రోణ కుటుంబిని 'పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్త' కాకుంట కాతని విడిపించి తన సుస్వభావము చూపిన ద్రౌపది ఈ సందర్భమున జ్ఞప్తికి వచ్చుచున్నది. భారతభూమి సహగమనములకు సార క్షేత్రము. ఇచట జనించినపక్షులకును సహగమన మాచారమని ఈకపోతి చూపినది.

ఈకపోతియు కపోతమును దాంపత్యమునుగూర్చి ఉత్కృష్టాదర్శము గలవారు.

"శబ్దార్థములభంగిఁ జంద్రచంద్రికల య
ట్లన్యోన్యమైత్రి నెప్పారుచున్న
మన కాఁపురంబు" — అని కపోతము

"రమ్యకుసుమంబ వీవు సౌరభమ నేను
నిండునెల వీవు పండువెన్నెలను నేను
పదమ వీవు తదర్థసంపదను నేను" — అని కపోతి.

ఇట్టి 'వెలితియెఱుఁగని' పిట్టల దాంపత్యముననే 'కపోతదాంపత్యము' అను కవిసమయమేర్పడినది.

ఈ కథ ఆర్యవాఙ్మయమునకుఁ గీర్తిఁ దేఁగలకల్పన. పశువులను, పక్షులను పాత్రలనుగఁ జేకొని కథ నిర్వహించుట ఆర్యసాహిత్యమున చిరంతనసంప్రదాయము. క్రౌంచపక్షుల మూలమున వాల్మీకి కవి యయ్యెను. పక్షులకు ప్రత్యేకభాష కలదని కేకయ మహారాజు చరిత చాటుచున్నది. నలదమ

యంతులకు, ప్రభావతీప్రద్యుమ్నులకు సంధానము పక్షుల మూలముననే. ఇట్టి నిదర్శనము లనంతములు.

పంచమవేదమైన సంస్కృతభారతమునం దీకథ గలదు. తిక్కన తెనిఁగించినాఁడు. దానిని ప్రబంధశైలిని పెంచి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారిట్లు క్రొత్త వెలయించినారు. చౌదరిగారు బహుద్రష్ట లగుట ఘట్టుప్రభువు, పోతన్న, నన్నయ మొదలగు ఆంధ్రకవుల పోణిమిపోకడ లిందుఁ బొసఁగినవి. సీసపద్యమును వీరు ప్రబంధకవులవలె వర్ణనాంశమునకేకాక పురాణ కవులవలె కథానివేదనమునకుఁ గూడ వాడిరి. సందర్భము పొసఁగినపు డెల్ల ప్రపంచవిషయ ప్రస్తావముచేసి వీరు కావ్యమునకు ప్రయోజనమును కలిగించినారు. కపోతము కర్షకజనమాన్యతను గూర్చి చెప్పినవాక్యము లిందులకు నిదర్శనము.

ఈ కబ్బము బాలురు బాలికలు సంకోచములేక చదువఁదగినది. విద్యాధికారులు ఇందలి మేలెంచి విద్యార్థులకు దీని నందిచ్చి వారికి ఉన్నతాదర్శములు హత్తుట కవకాశము కల్గింతురుగాక!

మదరాసు
౧౮—౩—౧౯౩౭

ఆంధ్రశేషగిరిరావు
సారస్వతసమాజము

# సమర్పణము

నిండీనిండని జవ్వనంపుసిరితో
నిర్భాగ్యతాపూర్ణ మై
పండీపండని కోర్కెతీవగమితోఁ
బాధస్తరంగాభ మై
యుండీయుండని మాయదారి బ్రతుక
య్యో! యేల సాగించి నన్
మండీమండని మొండిఁ జేసితి వధ
ర్మం బూని ప్రాణేశ్వరీ!

తరుణీ! నీయనురాగనౌకఁగాని చిం
తాఘోరవారాశి ని
స్తరణంబున్ ద్రుటిలో ముగించి పరితో
షప్రాజ్యసామ్రాజ్య సు
స్థిరపీఠంబు నలంకరింప మది నెం
తే నాసగొన్నట్టినన్
దురవస్థావశుఁ జేసి వీడఁ దగునే
దోషంబు వాటిల్లదే

పరిశీలించిన యుష్మదీయ మగు లో
పం బున్నదే యింపు దు
ర్భరచింతాహతబుద్ధి నాట నిను దూ
అం జొచ్చితిం గాని యె
వ్వరికేనిన్ దురతిక్రమం బగు విధి
వ్యాపార మాపైఁ బురా
దురితం బూరకపోదు శోకహత మెం
దున్ లోక మో రాఘవా!

నీకు—సాధ్వీవతంస వౌ నీకు—నిర్భ
రాత్మగౌరవసంపూర్ణ వైన నీకు
నిర్మలప్రేమచిహ్నమై నివ్వటిల్ల
నంకిత మొనర్తు నీకృతి నందుకొమ్మ

నీ కిపు డే నర్పించిన
యీ కావ్యము సాధులోకహృదయంగమ మై
యాకల్పము నవికల్పత
నీకీర్తి రమావిలాసనిలయం బగుతన్

(ఆంగీరస — వసంతోదయము)

# ఆత్మార్పణము

అక్కటికంబులేని కలు
షాత్ముఁ డొకానొకబోయవాఁడు పెం
పెక్కినకాననంబులకు
నేగి ఖగంబుల కుచ్చు లొడ్డి చేఁ
జిక్కినవానిఁ గొన్నిటి భు
జించుచుఁ గొన్నిటి విక్రయించుచున్
బెక్కుదినంబు లిట్లు గడ
పెన్ దనజీవిత మొక్కపల్లియన్

ఆతఁ డొకవేకువం గృ
ష్ణాతటకాంతారములకుఁ జనియెను మృగయా
కౌతూహల మడర ధను
శ్శ్యాతాశుగవాగురాదిసాధనుఁ డగుచున్

కఱకుటుండల గుండె లురలించి జిగిమించు
కొక్కెర లొక్కన్నింటి నుక్కడంచె
మొఱకుఁగోలలు గాత్రముల నుచ్చిపో నేసి
కొన్నిసాళ్వంబులఁ గూలఁద్రోసెఁ

జెట్లఁ బుట్టల రావిజగురు గండెలఁ బన్ని
కొన్నిగోర్వంకల మన్నిగొనియెఁ
గడఁగి యందందు నూకలఁ జల్లి వల లొడ్డి
పావురాల్ గొన్నింటిఁ బట్టికొనియె

జంగుపిల్లులఁ గుండేళ్ళ ముంగిసలఁ గు
ళింగములఁ బట్టెఁ గొన్నింటిఁ జెంగలించి
వేఱ వర్ణింపనేల యవ్వేళఁ బ్రళయ
కాలసంప్రాప్తి యయ్యో నగ్గహానమునకు

ఈ పరమకలుషహింసా
వ్యాపారం బంత కంత కగ్గల మగుటన్
గోపించె నన నహస్కరుఁ
డేవున నడిమింట మండునెండలఁ గాసెన్

అఖిలసత్వశరణ్యా మా నయ్యరణ్య
మ ట్టుడికినట్టు లుడికెఁ జండాతపాగ్నిఁ
గడచె నొక రెండుగడియలకాల మిట్లు
పీచుపీచుమబ్బులు మింట లేచుపఱకు

తగవరిసిరికై వడి న
మ్మొగుళ్ళు లోగిం బెరిఁగి గగనమున నెల్లెడలన్
నెగడుడుఁ జల్లని తెమ్మెర
నిగిడె నడఁగె నుమ్మదంబు నిముసములోనన్



అంత సముద్దాంత మగుభంగిఁ గల్పాంత
తీవ్రవాయు వనంగ దిక్కదంబ
మల్లాడ గిరులు కంపిల్లఁ బెల్లుగ రేఁగి
పెనుగాలి సాగెఁ దద్భీకరార్భ
టికి నయ్యడవి నున్న సకలమృగంబులు
ఖగములు నెంతయుం గలఁగి చెదరెఁ
బెళపెళధ్వనుల మ్రాఁకులు గూలె జొంపము
ల్గొన బాఱె రోదసీకుహర మెల్ల
ధూళితో నిండె నిటు సముద్భూతవివిధ
జంతుసంతానమును భయాశ్రయము నగుచుఁ
గొంతకాలంబు విసరి విశ్రాంతిసెందెఁ
జండవాతంబు భూతముల్ సంతసింప

గాలి యడంగ మేఘము ల
ఖండగతిం జెలరేఁగి గర్జితా
భీలము లై తటిల్లత ల
భిన్నము లై తులకింపఁ బిడుగుల్
రాలుచు నుండ దిగ్గజక
రంబు లనం దగువారిధార లు
ద్వేలము లై యెసంగ నట
విం గురిసెన్ జడివాన జోరునన్

అది పల్లమిది మిట్ట యను విభేదము లేక
యడవి వెల్లువనీట నడఁగిపోయెఁ
దొలుతఁ గూలినవృక్షముల నీడ్చికొనుచుఁ బ
ర్వెత్తె వాఁగులు గట్ల నెత్తికొనుచుఁ
జటులధారాపాతసంపీడితాంగంబు
లగుటఁ గొన్నిపులుంగు లంతరించెఁ
జిలువమన్నీలు కోమల వీడి గుమిగూడి
వేడుకమై జలక్రీడ లాడెఁ

గొండకోనలలోఁ దరుకోటరముల
నురునికుంజంబుల మృగంబు లొదిఁగియుండె
గడగడ వడంకఁ జలిగాలి కసరి విసరె
నబ్జబాంధవుఁ డింతలో నస్తమించె

దుర్గమారణ్య మదిగాక దుర్దినంబు
వెండియుం జడివాన పైపె చ్చమాస
నల్లవో ! యేమి సెప్పెద నాఁటిరేయి
కాటఁ గ్రమ్మినచిమ్మచీఁకటులపేర్మి

అత్తఱి నక్కఱకుఱుకుదొర వెఱపుగొలుపు నక్కా
నం గాంచి యుల్లంబు తల్లడిల్ల వదనంబు పల్లటిల్ల నెద్ది
యుం దోఁపక రాపడి నిల్చి



అక్కట ! యేమిసేయుదు మ
హాగహనం బిది కాఱుఁజీఁకటుల్
నెక్కొనె శీతవాతములు
నిండె శరీరము గొంకువోయె నీ
దిక్కిది యం చెఱుంగఁగల
తెన్ను గనంబడదయ్యె వర్షముల్
నిక్కుచునుండె వెల్లువలు
నెట్టుకొనం దుది కెద్ది మూఁడునో

ఇదియ జగమందు నాకుం
దుదినిముస మ్మనుచు మదికిఁ దోఁచెడిఁ గా దే
నెదిరించునె యింతటియా
పదలు ననుం జుట్టుముట్టి బంధురభంగిన్

ఇచ్చవచ్చినపుల్గు వ్రచ్చి వెచ్చనిపచ్చి
పొలసు మెక్కెడుగీఁత తొలఁగు నొక్కొ
జిడ్డుఁదేనెల నూరు జీడిమామిడిపప్పు
నారగించు నదృష్ట మాఱు నొక్కొ
చవు లూరఁజేయు కల్సారాలఁ దెగఁద్రావి
మత్తిల్లు భోగంబు మడఁగు నొక్కొ
నెక్కొన్నకూర్మి నానిసువుపజ్జకుఁ జేరి
ముద్దాడుభాగ్యంబు ముగియు నొక్కొ

బంగరుంబొమ్మఁబోనినాసింగిఁ గూడి
యెడఁద చివురింప సుగములకడలిఁ దోఁగు
నుత్తమోత్తమకాల మిం కుండ దొక్కొ
నేఁటితో నాకు నూతేండ్లు నిండు నొక్కొ

బోయం డార్తుఁడు రక్షణీయుఁ డని సం
　　పూర్ణానురాగంబుమై
నాయీయాపదఁ బాపుపుణ్యుఁ డెవఁ డు
　　న్నాఁ డిప్పు డిచ్చోట నేఁ
జేయంగల్గినకార్య మెయ్యది యిఁకన్
　　జీవించు టేలాగు నా
యాయుర్దాయము నాహరించుటకు నీ
　　వాసించితే దుర్విధీ !

నాకనుదోయిముందు మర
　　ణంబును గాంచిరి పెక్కు రే నసం
ఖ్యాకవిహంగరాజములఁ
　　గాఱియపెట్టితిఁ జేతులార నే
శోకము నప్డులే; దిపుడు
　　చొప్పడు నాదగుచా వటన్న ని
య్యాకులపా ట దేటి కది
　　రా! బ్రతు కెంతయు రుచ్య మౌఁ గదా



వని కేఁగి తినుటకై వలయునంజుళ్ళను
　　బడసి యెప్పటియట్ల ప్రాహ్ణమునకు
వచ్చెద నేనంచు నచ్చి నాదగురాక
　　కెదురుసూచుచు నాకుటెంటిముందు
నిలిచి యెంతకు రామి నిస్పృహా చెంది న
　　న్నెపాము కఱచెనో యేమెకంబు
విఱిచెనో యంచు భావించి నేఁ డెన్నిభం
　　గుల నేడ్చుచున్నదో కోమలాంగి

పేర్మి నల్లారుముద్దుగాఁ బెంచుచున్న
పిల్ల లిపు డెంతగా దురపిల్లుచుంద్రొ
యెవరిగతి వారిదే యటం చెఱుకగల్గు
పెద్దలాడెడిపల్కు నిబద్ది యయ్యె

కట్ట! దయ వీడి యీపాడుపొట్టకొఱకు
నింతవఱ కెన్నిపుల్గుల నేసి చంపి
జంట లెన్నిటి నేడ్పించి యుంటి నొక్కొ
కడకుఁ గుడువంగ వలదె తత్కలుషఫలము

అని పెక్కు లగు తెఱంగుల
వనరుచుఁ దా నుండఁ గొంతవడి కజ్జడి మె
ల్లన తగ్గెన్ జలదంబుల
పెను పఱె గాఢాంధకారభీతియు నడఁగెన్

అంత నజ్జడిపోకకుం గిరాతుఁ డొకింత సంతసించి యు
ద్రేకని యీఁదర తాఁకునకు లోఁగి యంగము తెల్ల
వడంక నింక నేమి సేయుదు నని పనవి నలుదెసలకుం
జూడ్కులు నిగిడించి చేరువమిట్ట నేల నింగి ముట్టె
దట్టంపుగుబురులం గ్రిక్కిఱిసి పక్కి మొత్తంబుల కెల్ల
నిక్కమై యలరు నొక్క మఱ్ఱిమ్రాఁకుం గని దాని
చాటున దెల్లవార్ప నెంచి తాఁ బట్టిన పిట్టల పిండు మన
స్గని యుపలం దులకించుగనయంబును బిల్లగుబ్బలి
యన నుబ్బి యబ్బురంబు గొల్పు దాపటిమ్రాఁకు నం
గీలించి మెల్ల మెల్లన వెల్లువఁ గడవ నడిచి యత్తరువుం
దరిసి తన్మూలంబున గల కటికిఱాబండపైఁ దన మేను
వైచి యేచిన భయంబున

దిక్కు మాలినబోయ దీనతం బాపరే
కానన దేవతాగణములార !
నిండారుకూర్మి మన్నించి రక్షింపరే
చటులకాంతారవృక్షంబులార !
పగవాఁడ నని తలంపక కూర్మిఁ జూపరే
సాధువిహంగరాజంబులార !
యాపన్నుఁడను గాన లోపముల్ మఱవరే
భల్లాదిమృగకదంబంబులార !



సీతు విదిలించుచుండె హెచ్చెను బుభుక్ష
యసువు లేనింట మూఁడునాళ్లరిగెఁ దొఱఁగి
దుర్భరపుమృత్యుముఖమునఁ దూఱియుంటి
నెట్లు రక్షింతురో మీర లిపుడు నన్ను
అని పులుఁగుదిండి యెలుఁగురాల్పడ వేఁడి వేఁడి
కన్నీరు మున్నీరుగా వగలసెగలం బొగులుచుఁ బరుష
పాషాణపర్యంకమున నొత్తిగిల్లి యుండె — నత్తఱిఁ
దడవులం బట్టి యమ్మఱ్ఱితొఱ్ఱఁ గాలంబు పుచ్చు
పావురం బొండు వఱువాత నెరకోఱ కరిగిన తన యిల్లా
లెంతకుం గూఁడు సేరమి నరసి వెఱతఱచునఁ బరిపరి
విధంబులఁ బొరింబొరి దురపిల్లుచుఁ బల్లంబులకు డిగు
వెల్లువనీటిజాళుల నుప్పతిల్లు "జలజల" మను చప్పు
ళ్లతో మేళగించి మ్రోళులు చిగుర్ప దుర్భరవియోగ
గీతంబులఁ బాడుచు నిట్లు విలపించె
వేకువ లేచి నా కెఱఁగి
వేడుకమై హృదయేశ ! యిప్డ నా
యాఁకటిచిచ్చు నార్పఁ గొన న
య్యయి తావులకున్ గమించి నీ
శ్రీకరపాదపంకరుహ
సేవకు వత్తునటంచు నేఁగి నీ
వేకడ నుంటివో తరుణి !
యింతకుఁ గన్పడవైతి వక్కటా !

అర్ధాంగి! నాహృదయం బెఱుంగఁ దలంచి
సురిఁగి యుంటివె వనాంతరమునందు
వనిత! ని న్నెడసి యుండిననిమేషంబు నా
కొకయుగంబుగఁ దోఁచుచుండుఁ గాదె
కలికి! ని న్నీరేయి గాటంపుటడవి నే
పొదరింటఁ గల వని వెదక నేర్తుఁ
దరుణి! నా యీయవస్థ నెకింత గన్న నీ
హృదయంబు చిదురలై చెదర కున్నె

గరిత! రాచిల్క లేనిపంజరముకరణి
నుండె మనగూఁడు నీవు లేకున్కి నిపుడు
తెఱవ! నీతోడు లేని నాదేహయాత్ర
జగతి నెక్కనిమేషంబు సాగఁగలదె

కడ లేనినీతు వెంతయు
వడఁకింపఁ దొడంగె వేగ వచ్చి నను న్నీ
పొడువారుగఱులఁ గప్పుము
పడఁతీ! నాచింత లెల్లఁ బాయును దానన్

కలదే ప్రాణము నీశరీరమున నో
కాంతాలలామంబ! యే
వలలోనం బడి యుంటివో! కొదమసా
ళ్వం బెద్దుటం జిక్కితో



చెలి! ఝుంఝూహతికిన్ గఱుల్ విఱుగుటన్
జీవంబులం బాసితో
ప్రళయాకారపయోదముక్తకరకా
పాతంబునం గూలితో

యువతిరో! నీవు జీవించి యుంటి వేని
యేల రాకుందు వింటికి నింతదాఁక
లేవు గాఁబోలు జగతిలో నీవు బ్రతికి
రావు గాఁబోలు నిఁకఁ గోటరంపుదెసకు

ఆలుమగలఁ జేర్చి యాడించి వెండియుఁ
జీలఁ దీయుచుండెఁ గాలపురుషుఁ
డబల! వీనిడెంద మది యేగతి న్నిల్పెఁ
గనికరంబుపొంతఁ గఱకుఁదనము

సకలదుఃఖరోగసంపీడితున కింతి
యౌషధం బటన్న నబ్బురంబె
యువిద! నిన్నుఁ గూడి యున్నంతవఱకు నే
యాపదల నెఱుంగఁ డయ్యో నితఁడు

శబ్దార్థములభంగిఁ జంద్రచంద్రికల య
ట్లన్యోన్యమైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబుఁ గన్గొన మాలవిధి కెంత
కన్నుగుట్టెనొ జగత్కంటకునకు

నడవిమేఁతల మేసి పడియనీళులఁ ద్రావి
వరులసొమ్మున కాసపడక యొరుల
కొకకీడుఁ జేఁతయు నొనరింపక మెలంగు
మనజీవితము దైవమున కదెంత
భారమయ్యెను పాపంబు పండె నిట్లు
విధివిధానంబు నెదిరించువిధము గలదె
కటకటా ! నేఁటి కెట్టిసంకటము వచ్చె
నెట్లు దీని భరింతు ది క్కెవ్వ రబల !

అఱలేని కూర్మిపేర్మిం
బూర పొచ్చెము లేనిడెందముం జూపి నను
గరము నలరించితి గదా
గరితా ! ని న్నెట్లు మఱవఁ గలవాఁడ నిఁకన్

నీమందస్మిత సుందరాస్యతలమున్
నీ నిగ్గులన్ జగ్గులన్
నీమైమవ్వము నీకనుంగవపసన్
నీ నెన్నడల్ సొంపులన్
నీమర్యాదల నీమృదూక్తులను నీ
నెయ్యంబు నీతియ్యమున్
భామా ! నే నెటు విస్మరింతుఁ జెపుమా !
ప్రాణంబుతో నుండఁగన్



సకియా ! మాపటివేళ ని న్గలసి కృ
ష్ణావీచికాశీకర
ప్రకరాసేచిత నవ్యదివ్యసికతా
భాగంబునన్ జేరి వా
తకుమారంబులు గంధబంధురము లా
త్మప్రీతిఁ గావింప వే
డుకమై గొండిలిసల్పు నే నయిచు పె
ట్టూ నీవియోగవ్యథన్

అతివ ! నీ విచ్చుమేఁతల నారగించి
నీమృదులపాణిపల్లవానీతపూత
సలిలముం గ్రోలి సంతోషజలధిఁ దేలు
భాగ్య మున్నదె నీమనఃపతికి నిఁకను

కలిమిలేములలోన భాగంబు గొనుచు
మంచిచెడ్డలలోనఁ బా ల్పంచుకొనుచు
మెలఁగునరాంగి దూరమై తొలఁగె నేని
మగని కాధార మెవ్వ రోమగువ! చెపుమ

ఓవనిత ! సకలసౌఖ్య
శ్రీవిరహిత మైన తుచ్ఛజీవిత మిఁక నే
లా వెల్లువలోఁ బడి నా
జీవంబుల విడుతు నెల్లచింతలఁ గడతున్

ఇట్లు పెద్ద వగచుమగపావురంబువిలాపంబు
లబ్బోయవలఁ జిక్కి కుములుచున్నకపోతి. విని
ధన్య నైతిని జగన్మాన్య నైతిని మహా
పుణ్య నైతిని సతీగణ్య నైతి
నాథుఁ డస్మద్వర్తనంబు నెంతయు మెచ్చి
ప్రకటించె నిర్మల ప్రణయగరిమ
నాయీయెడాటంబునకుఁ బొరింబొరిఁ గుంది
జోరున వేఁడికన్నీరు రాల్చె
మగనినెమ్మదికి నిమ్మాడ్కి నెక్కొటయ కా
కులకాంత సతతంబుఁ గోరుచుండు
నింక వలసిన దేమి నా కీభవంబు
సార్థకతచెందె దుర్గతిప్రాప్తి దప్పెఁ
బాపము లడంగె నోములపంట పండె
ననుచు మదిఁ బొంగి మగని కిట్లనఁ దొడంగె
ఏల దురంతచింత నిటు
లేడ్చెద వో హృదయేశ! నేఁడు దు
ష్కాలము దాపరింపఁ దోలు
కర్మము న న్నొకబోయవాగురన్
గూలఁబడంగ నేసె నిటఁ
గుందుచు నుంటి భవత్పదాబ్జముల్
వాలినభక్తిఁ గొల్చువిభ
వం బఖిలంబును గోలుపోయితిన్



ఒచ్చెంబు నెఱుంగక మన
మిచ్చో దంపతుల మై రమించితి మిన్నా
ళ్ళిచ్చెరు వగు సంసృతిఁ గన
విచ్చుచునున్నార మిప్డు విధియోగమునన్

బాగుండెదానఁ గానన్
వాగురలోఁ జిక్కి గాలివాన కలసి నీ
యోగంబు నెఱసియు నను
త్యాగం బొనరింపనైతి ననురాగనిధీ!

ఉసుఱులు దొలంగ సిద్ధమై యున్న వేళఁ
దలఁపనితలంపుగా భవద్దర్శనంబు
నాకుఁ గల్గించినట్టి ప్రేమైకమూర్తి
కార్త జనబాంధవునకు జోహా రొనర్తు

ఎడ తెగక మనదాంపత్య మింతవఱకు
నెన్నిపుట్టువులం దరియించెనొక్కొ
జీవితేశ్వర! యిది యవిచ్ఛిన్నమగుచు
నెల్లకాలంబు నిట్లు భాసిల్లుఁ గాత!

నీకొఱకు నిరీక్షించుచు
నాకమ్మున నీదుచింతనము సేయుచు నె
ట్లో కాలము గడపెద నిట
నాకొఱ కోనాథ! మనమునం గుందకుమా

నీకనులుగార్చు వెచ్చనినీటిసోన
కాల్చుచున్నది మన్మనఃకందరంబు
నేమి సేయుదు శోకంబు నెడసి మధుర
వాగమృతవృష్టి ననుఁ దన్పవా మనోజ్ఞ!
ఆఁడుపులుం గిట్లనునెడఁ
గూఁడు న్విడనాడి వెఱఁగుఁ గొందలము నెదన్
జో డై కలంపఁ దలిరుం
బోఁడికడకుఁ బోతుపిట్ట బోరన వచ్చెన్
వచ్చి యురులం దవిలి యున్నయన్నుం జూచి
హా! రమణీ! పారావత
హారమణీ! నన్ను విడిచి యమరీప్రియమం
దారోద్యానవనీ సం
చారంబును గోరి వెడలఁ జనునే నీకున్
కటకటా! నేఁటికెట్టి దుర్ఘటన వొడమె
వనిత! యీకాలపాశంబువలన నిపుడు
నిన్ను విడిపించువెరవు గన్పింపదయ్యె
నేఁటితోఁ దీఱునే పొత్తు నీకు నాకు
వీసంబును లాఁతులయెడ
దోసంబుఁ దలంపనట్టితోయలి వకటా!
నీసాధుచరిత కిది ఫల
మా సుదతీ! దైవ మెంత కైనం దగదే



ఒకపరి నిన్ను నన్ మృగయుఁ
డొడ్డినవాగురలోనఁ గూలఁద్రో
యక నిను నెంటిగా వలకు
నప్పనచేసి దయావిహీనతం
బకపక నవ్వుచున్ మనవి
పత్తులఁ జూచుచు గేలిసేయున
ట్టి కలుషదైవ మెంతవిక
టీకృతశీల మహా! తలంపఁగన్

వలలన్న జిగురులన్నన్
దెలివిమెయిం దిరుగుచుందు తెఱవా! యిపు డెం
దుల కేగె నీవివేకము
కలయ న్నీకనుల మబ్బు గ్రమ్మెనె చెపుమా

గాటపుంగానఁ బయనించు బాటసారి
యాతపార్తిఁ దరుచ్ఛాయ నాశ్రయించె
వానసాగుడు నొకలోయలోనఁ దూఱెఁ
దుదకు [illegible]ఘాతమ యడంచె బ్రదుకు నెట్లు

ఈమహాజలరాశిలో మునింగినవేళఁ
దెప్ప వై హర్షాబ్ధిఁ దేల్చితి గద
యీగాఢతిమిరంబు మూఁగి ముట్టినవేళ
దీపంబ వై తెన్ను సూపితి గద

యీదారి కర్దమం బెనసి యుండినవేళఁ
గోల వై నడిపింపఁ జాలితి గద
యీమహోన్నతశైల మెదురువచ్చినవేళ
గగనయానంబ వై కాచితి గద
నీసహాయత లేక నాచేసినట్టి
గట్టికర్జ మొకం డేనిఁ గానఁబడునె
యఖిలమునకు నాధారంబ వైతి వీవు
వెలఁది ! నిన్బాసి యెట్లు జీవింప నేర్తు

అని చింతించుమగనిం గని కపోతి

హృదయేశ ! నిఖిలార్థవిదులు నాఁ దగుమీర
లీరీతి వగనొన్న నేమిఫలము
దైవనియోగంబు దలఁగ బ్రహ్మేంద్రాదు
లగువేల్పులకు నైన నయితి యగునె
కటికరిదైవంబు తెటచిన దుఃఖమన్
వాకిలి ధైర్యకవాట మొత్తి
మూయంగవలెఁగదా ! బుధులు శోకహతంబు
లోకం బటంచుఁ బల్కుదురు వినవె

యిల మెలంగుశరీరధారులకు నెల్ల
జననమరణంబు లన్న నైసర్గికములు
కసిమసంగినమిత్తిగం డెసఁగ నడఁచి
యెల్లకాలంబు నొకమేన నెవ్వ రుంద్రు



జీవులను సృష్టిగావించుశిల్పి యెవఁడో
ప్రాణులను గూర్మిఁ గాపాడుభర్త యెవఁడో
వాఁడ వెండియుఁ గూల్చు విశ్వంబు నెల్ల
నతని కిది నిత్యలీలావిహారసరణి

ఈలతయు నీకుజంబును
మేలుగఁ గొన్నాళ్లు కలసి మెలసి మరలఁ బె
న్గాలికి విడివడుచుండుఁ గ
దా ! లోకం బెల్ల నివ్విధమునన సాగున్

ఆపదలు కల్గువేళఁ గట్టా ! యటంద్రు
సుఖము లొనగూడువేళ మెచ్చుకొనుచుంద్రు
కాని యెవరేనిఁ గష్టసుఖాలపట్లఁ
గడఁగి స్వాతంత్ర్యముం జూపఁ గలరె చెపుమ

కావున నీవు నాకొఱకిఁ
క న్విలపించుట నిష్ఫలంబ నా
జీవములం దపేక్ష విడి
చిత్తమునం దగుశాంతిఁ బూని నీ
జీవితశేషముం విబుధ
శేఖరు లెంతయు మెచ్చ ధర్మసం
సేవనబుద్ధిమైఁ గడవఁ
జేయుము కోయుము మోహబంధముం

ఆస నడంపు మోర్మిఁగొను
మార్యపథంబును ద్రొక్క నిక్కపుం
బాసలువల్క శాత్రవుల
పై నయినం బెరిమంబ నిల్పు సం
త్రాసము గొన్నదీనుల స
దా కరుణింపు మనంబుఁ బెంపు మే
దోసము నాచరింపక బు
ధుల్ నుతి గాంచుము జీవితేశ్వరా!

శరణ మటన్న వాఁడు నిజ
శాత్రవుఁ డైనను వాని నెంతయుం
గరుణ దలిర్పఁ బ్రోచుటయ
కర్జము నుత్తమధర్మ మంచు స
త్పురుషులు వల్కుచుందు రిది
బుద్ధిఁ దలంచి కిరాతు పీని నా
దరమునఁ జూడవయ్యా! చలి
తాఁకున కెంతయుఁ దల్లడిల్లెడిన్

మనయండఁ జేరినవిప
న్నునకుం దోడ్పడెడినోము నోఁచనికతనన్
దన కిట్టు లయ్యె నీ వై
న నీతనికి సాయపడు మనాథుం డగుటన్



మగఁడు నేఁడు రాక మసలె నదే మొకో
దైవమా! యటంచుఁ దల్లడిల్లి
యెఱుకునింతి యింట నెళ్లేడ్చుచున్నదో
జాలిగొల్పు పీనిచరిత మకట!

విను మిల్లుత్రొక్కుకొని వ
చ్చినయతిథికి శక్తి కొలఁదిఁ జేయం దగు మే
లనఘా! నిరాశతోడం
జను టొప్ప దతండు ధర్మసార మిది గదా!

అతిథుల నభ్యాగతులన్
గుతుకంబునఁ బూజనేయుగుణ మీకర్మ
క్షితిఁ బుట్టినట్టివారికి
మతి నూహింపగ నవీనమా హృదయేశా!

ఆపత్సాగరవీచికాహతులచే
నల్లాడి యల్లాడి ప్రా
ణాపాయంబునకున్ దలంకి శరణం
బం చేడ్చెడిన్ వీఁ డయో
లోపంబుల్ గణియింప కీతనిఁ గృపా
లోకంబులం జూచి నీ
వాపద్బాంధవుఁ డన్నకీర్తిఁ గొనవ
య్యా! ఖేచరగ్రామణీ!

భేదబుద్ధి విడిచి విశ్వ మీశ్వరకళా
దర్పణం బటంచుఁ దలఁచి భగవ
దర్పణంబు గాఁగ నఖిలధర్మంబుల
సలుప కున్న ముక్తి కలదె చెప్పుమ

దీనుల మొఱ లాలింపని
వానిబలంబును ధనంబు వంశంబును వి
జ్ఞానంబు జీవితంబు ద
యానిధి! వ్యర్థంబు లగుఁ గదా పరికింపన్

తన మానముఁ దనప్రాణముఁ
దనవిత్తముఁ దనబలంబుఁ దనసర్వస్వం
బును విశ్వశ్రేయస
మున కర్పణసేయువాఁడె ముక్తుఁడు సుమతీ!

లోకంబ నేను నేనే
లోకంబ నటంచు నాత్మలో నెంచినను
శ్లోకునకు నింద నందున్
జేకూరు నఖండహర్ష చిరసౌఖ్యంబుల్

సమదృష్టి లేమి సంకుచి
తము లగుభావంబులకు నిదానంబు గదా
సుమహితచరిత్ర! విను సం
ఘమున కధఃపతనపీడ కల్గును దానన్



పరమేశ్వరగురుతేజః
పరిపూరిత మై వెలుంగుప్రకృతిని వికృతిం
బొరయనిచిత్తంబున నీ
శ్వరతుల్య మటంచుఁ గొల్వవలయు మహాత్మా!

ఇట్లు ధర్మోపన్యాసము నొసంగిన
విని మగపుల్గు విశ్రుతవి
వేకముఁ గాంచి కపోతి మెచ్చి నె
మ్మనమున ధర్మతత్త్వసువి
మర్శనముం బొనరించి కామినీ
జనధనపుత్రబంధుభట
సౌఖ్యము లెంతయుఁ జంచలంబు లం
చు నెఱిఁగి సంసృతిం దెగడి
శోకభయంబులఁ బాసి వేండియున్

జీవుఁ డొడలిం దొఱంగెడి
చో వెంటం దోడువచ్చుచుట్టంబు మదిన్
భావింప ధర్మువ కదా
నీవాఁడ నటం చెవండు నెయ్యము సూపున్

అని విచారించి సంచలించునంగంబులం గుందుకిరాతు దెసఁ బ్రసాదభాసురం బగునపాంగావలోకనంబుం బఱపి మృదుమధురకంఠస్వరంబున మానుషభాషణంబు లొలయ వాని కిట్లనియె

అయ్యా! తొల్లిటిపున్నెపుంబలిమి
నీ కాతిథ్యమున్ సల్పి నా
నెయ్యంబున్ బ్రకటించుభాగ్య మొదవెన్
నేఁ డీగతి; న్నీ వీఁకన్
డయ్యంగాఁ బనిలేదు నీదగు
నభీష్టం బెద్దియో చెప్పితే
నియ్యల్పుం డనువైనసాయమును దా
నింపారఁ గావించెడిన్

మానవునకుఁ బులుఁ గేచం
దానన్ దొడ్డ్వాడు నటంచుఁ దర్కింపకుమీ
మానవ మృగ ఖగ నగ మయ
మైనజగం బెల్ల నీశ్వరాంశంబ కదా!

ఈశ్వరునిశక్తి నాయందు నింతో యంతో
కలదను మ్మాటగుట నిట్లు వలుకు టొదవె
వెండియున్ భారతోర్వీలో వెలయుశిలయు
నతిథిపూజాపరాయణం బగుట వినవె

జాతి మత కుల గుణాదుల
నీతటి నరయం బ నేమి యెవ్వని కైనన్
జేత నగుమేలు సల్పుట
పాతకహారణంబు చువ్వో పరికింపంగన్



నావుడు నక్కిరాతుఁడు మ
నంబున నెంతయు సంతసించి యో
హో! వెఱఁ గయ్యెడిన్ ఖగకు
లోత్తమ! నీనుడి విన్నఁ; బాపపుం
ద్రోవలఁ ద్రొక్కి మిమ్మొపుడుఁ
ద్రుంచుదురాత్ముని నన్ను నిట్లు సం
భావనచేసి మంతె! తగు
భంగి నినుం గొనియాడ నేర్తునే

జడివానం దడిసితిఁ జలి
గడగడ వడఁకించుచుండెఁ గాయ మ్మకటా!
ముడుచుకొనిపోయె నియ్యది
విడివడున ట్లాచరింపవే! వెర వున్నన్

నీ వీసాయ మొనర్చిన
జీవించెద నిప్పు; డట్లు సిద్ధింపనిచోఁ
బావనగుణాఢ్య! నాకుం
జావది తప్పక ఘటిల్లు క్షణకాలమునన్

అని ప్రార్థించుటయు నక్కపోతరాజంబు వానికిఁ దగు
ధైర్యంబు చెప్పి "యిదె వచ్చెద నుండు మన్నా!" యని

చట్టుప లట్టె విప్పి రభ
సంబు భృశం బొనరించి చెట్టులన్

గుట్టల దాఁటి తుట్టతుద
        కున్ నది కవ్వలిచక్కి నున్న పెన్
పట్టణ మొండు సేరి వెలి
        పట్టున గిట్టినచెట్టు మింటికిం
దొట్టి వెలుంగుచుండఁ గని
        త్రోడన వాలెఁ దదంతికంబునన్

వాలినవేడుక నచటన్
వ్రాలి తుది న్మండునింధనంబును నాసన్
గీలించి యార్తరక్షా
లాలస నేతెంచెఁ దనకులాయమ్మునకున్

ఎండుంజిదుగుల నీటన్
నిండినవనసీమఁ బడయ నేరక వెర వొ
క్కొండును దోఁపమి భగవం
తుండా! యిపు డేమి సేయుదు నటంచు మదిన్

కొంతతడవు వితర్కించి తుట్టతుద కోహో! పొర
పడితి - నెట్టయెదుట నున్నగూఁటి న్మఱచి యెండుఁ
బుల్లలకు నల్లాడునావెఱ్ఱి నేమనవచ్చు - నార్త
రక్షణంబునకంటె నిక్కలాయంబు నా కెక్కడే -
వలయునే నిట్టిగూఁడులఁ బెక్కింటి నొక్కదినంబునన
నిర్మింప నేర్తు నని తలంచి నీడముం దొఱ్ఱనుండి



క్రిందికినెట్టి యందు మెత్తగా నమర్చినచెత్తం దాఁ
దెచ్చినకొఱవి నిడి యూఁది మంటచేసి దానిం గులా
యేంధనములఁ గముంగడు నసరించి కిరాతుఁ గాంచి

అన్నా! దురంతశీతా
పన్నుఁడ వై నీవు వగవఁ బని లేదిదె మం
ట న్నిగిడించితి లె మ్మిఁకఁ
గ్రన్నన చలిఁ బాపుకొమ్ము గడగడ లడఁగన్

అనిన విని పుల్గుపల్కులు
తనడెందంబునకు నవసుధాధారాపా
తనిభంబు లగుచు బోయం
డనూనహర్షమున ముగ్గి యల్లన లేచెన్

అహాహో రవంబు లిహిహీ
యుహుహూ నాదములు సెలఁగ నొడ లున్నతి నం
ద హుతాశనకీలలఁ బా
దహస్తములఁ గాఁచికొని నతం డుత్సుకుఁ డై

వెచ్చపడె నొడలు సీతువు
విచ్చె సమస్తాంగకములు విడివడె మోదం
బెచ్చెఁ గిరాతున కత్తఱి
నచ్చపుడెందమునఁ బుల్గు నాతఁడు మెచ్చెన్

పావుర మపు డిట్లనె న
య్యా! వొగడం దగినవాఁడనా నే నస్మత్
ప్రావీణ్య మెంత సెపుమా
నావిధి నేఁ జేయకున్న నవ్వరె లోకుల్

ఓయన్న! చలి యడంగెనె
నీయంగము స్వాస్థ్యముం గనియెనే హర్ష
శ్రీయుతుఁడ వైతె నా కిఁక
నేయానతి నిత్తు వేగ నెఱిఁగింపఁగదే

అనుటయుం గిరాతుఁడు వినయావనతమస్తకుఁడై

ఏగతి నీఋణభారం
బీఁగెదనో సదుపకార మిట్లు సలిపి నా
యీగండముఁ దప్పించితి
నీగొప్పతనంబు నెన్న నేరఁ బతత్రీ!

ఈచిదుగు లెట్లు వడసితి
వీచి చ్చెటు లబ్ధమయ్యె నిందులకై నీ
వేచిక్కులఁ జిక్కితివో
నీచాత్మకు నివ్విధిన్ గణింతువె నన్నున్

జ్ఞానము నుపకారేచ్ఛయు
మానవగణమంద కాదు మఱియును ఖగసం
తానమునందుం గల వని
నే నెఱిఁగితి నేఁడు భవదనింద్యచరిత్రన్



కొంగరవోయిన నా స
ర్వాంగంబులు తిన్నపడియె నలజడి యడఁగెన్
భంగంబు నందె నీతు విఁ
కం గోరికి నా కొకండు గలదు ఖగంబా!

నీకొలఁది యే నెఱింగియు
నాకక్కఱతీరం దలంచి నయభూషణ! ని
న్నీకోర్కి కోరఁ దొడఁగితి
నేకరణిన్ దీనిఁ దీర్చి కృపఁ జూపెదవో

అనిన నక్కపోత మబ్బోయ కిట్లను
నేల సంశయింప నెఱుకుమిన్న!
యెద్ది నీయభీష్ట మెఱిఁగింపు మద్దానిఁ
దీర్తు నిపుడ పొసఁగు తెరువ యున్న

అనుటయు నతండు పారావతంబునకు

వందన మాచరించి శ్రిత
వత్సల! యేమని విన్నవింతు మ
త్తుందముసం దమందగతి
తోఁ జెలరేఁగె క్షుధానలంబు దీ
నిం దగురీతి నార్పి కరు
ణింపుము పెంపుము నీయశంబు నే
మందును మేర కన్పడవ
యాసకు నెన్నివిధాలఁ జూచినన్

రవి నభోమధ్యసీమకు రాకమున్న
వేఁట నుడిగి తొల్లిటియట్ల వెడలఁ దలఁచి
కుడువకయ వచ్చితిం జల్దికూటి నైనఁ
గడకు నాకోర్కె తీవ లిక్కరణిఁ దెగియె

"తా నొకరీతిం దలఁచిన
మానక దైవంబు వేఱుమార్గము ద్రొక్కున్
దీని నెఱుంగుఁ" డటంచు సు
ధీనిధు లనుపల్కు గుణనిధీ! వృథ యగునే

ఆదరమేదురబుద్ధిన్
నాదీపము వెలుఁగఁజేసినాఁడ విపుడు నీ
వో దీనావన! దీనిం
బ్రోదియొనర్పఁగదె యాఱిపోవక యుండన్

అనవుడు నద్దీనుని మొఱ
విని గుండె గుభాలు మనఁగ విహగము ధైర్యం
బును గోల్పడి గద్గద ని
స్వనమున నీరీతిఁ బల్కె శబరునితోడన్

మాకూడును మాగుడ్డయు
మాకలిమియు మాకొలంబుమరియాద లయో
నీ కెఱుక లేక యున్నవె
యీకోరికి నెట్లు తీర్తు నిత్తఱి నతిథీ!



ఏయెడఁ జిక్కనమేఁతల
నాయెడఁ గబళించి యచటనచ్చట మడుఁగుం
దోయములఁ ద్రావి కూఁటికి
హాయిగ నేతెంచుఁ గద విహంగము లెపుడున్

ఏపూఁటకూటివిషయం
బాపూఁటన తలఁచుఁ గాని "యవ్వలిపూఁటన్
లోపంబు లేక గడపుట
యే పగిది" నటంచుఁ బుల్గు లెంచునె చెపుమా

ఏవేళ యెట్టిదో యని
భావంబున నొచ్చి కూఁటఁ బట్టెఁడెరన్ జే
కావలి యుంతుమె మే; మ
ప్పా! వినవో పక్షిజాతి బండారంబున్

తాఁ దిన "దేహి" యటం చను
పేదకు వడ్డింప నతిథిబృందమునం ద
త్యాదరము నూప నెల్లర
కాదరువై వెలయ నితఁడు హాలికుఁ డొక్కఁ

ఎండకు వానకు జంకక
పండించినధాన్య మెల్లఁ బాఁతఱలందున్
నిండించి తినుచుఁ బెట్టుచు
నుండెడికర్షకుఁడె ధన్యుఁ డూహింపంగన్

అయ్యా యిమ్రాఁకులకుం జని
తియ్యనిపండులను ద్రుంచి తెచ్చుట కకటా !
యియ్యది జడికారు కదా
యెయ్యది కర్తవ్య మిప్పు డెఱిఁగింపవయా

ఏదారిఁ ద్రొక్కి యైనన్
నీదుబుభుక్షానివృత్తి నెఱపనిచో నన్
గా దంచు నిందసేయ రొ
క్కో ధర్మాధర్మవిదు లకుంఠితరీతిన్

కలరవరాజ మిట్టులు మొ
గంబున దైన్యము తోఁప నాఁకటన్
మలమల మాఁడుచున్నకసు
మాలపుబోయకు విన్నవించి తాఁ
దలఁపున నివ్విధిం దలఁచె
దైవమ ! యేవగ నీవిపన్నునాఁ
కలి దొలఁగింప నేర్తుఁ దగు
కర్జ మిఁ కెయ్యది పూని సేయఁగన్

ఇట్టలం బగునాఁకట నిల్లుసేరు
నతిథికిం దగునన్నపానాదు లొసఁగి
లేశ మేనియు మే ల్సేయలేనియనడ
బ్రదిమి యేటికిఁ బుడమికి బరువుచేటు



అతిథుల నాదరించి శర
ణార్థులభీతిఁ దొలంచి దీనసం
తతిఁ గరుణించి బాంధవజ
నంబులఁ బెంచి రక్షించువాని దా
బ్రతుకు భవంబు వంశమును
భాగ్యము భోగము యోగమున్ జగత్
త్రితయము మెచ్చు వానిన వ
రించుఁ గదా యపవర్గలక్ష్మియున్

గూఁట నెర లేదు వే ఱొక
చోటికిఁ జని దానిఁ జేరఁ జొప్పడ దంచున్
గూటి కిటు దేవురించు వ
నాటు హతాశుని బొనర్చు టనుచితము గదా

కావునఁ దప్పక వీనికి
నీవలె నాహార మిప్పు డిందులకై యే
నావంతయుఁ జింతింప క
నావిలభావంబుతో మదంగము నిత్తున్

ఉర్విని బెక్కునాళు లిటు
లున్నను గల్గు ఫలం బదేమి సీ
చర్వితచర్వణంబ కద
సంసృతి; మిత్తియు వెంట నంటి తా

గర్వము మీఱ మ్రింగుటకుఁ
గాచియ యున్నది భీకరాస్యముల్
సర్వము విప్పి; రేపయినఁ
జావున గొల్లక డాఁగ వచ్చునే

మలభూయిష్ఠం బతిచం
చల మగుమేనన్ బవిత్ర శాశ్వతమ కీ
ర్తి లభించు నింతకంటెను
గలదే లాభంబు చక్కఁగాఁ దలపోయన్

పరహితమున కెవ్వఁడు తన
శరీర మర్పించు నతఁడె శాశ్వతలోక
స్థిరవాసి యంచు ధార్మిక
శిరోమణులు సెప్పరే విశిష్టచరిత్రుల్

ఇట్లు నిశ్చయించి తనప్రాణప్రయాణసన్నాహంబు నర్ధాంగికిం డెలుప నెంచి వాగురాబద్ధయై తన మొగమ్మునందె చూడ్కి నిలిపి యున్నయిల్లాలిం జూచి

ప్రేయసి ! బోయవాంఛితము
వింటివె నీతు వడంపఁ గూటికిం
దోయిలిసాఁచె వీఁడితని
దుర్భరవుంగోదఁ దీర్ప గూఁటియం



దేయశనంబు లేదు గద !
యింటికి వచ్చినవిందు నిస్పృహన్
బోయిన సర్వపుణ్యములుఁ
బోవక నిల్చు నెకో తలంపఁగన్

అట్లగుట నిక్కిరాతునాహారమునకు
నప్పన మొనర్తు నాదు హేయంపుఁదనువు
వగవకుము నావియోగంబు వగచి వగచి
పరమధర్మజ్ఞ ! నీకుఁ జెప్పం బ నేమి

ఓవనిత ! బోయచే నీ
వేవిధమున నేని సమసె దిపుడో రేపో
కావున నా వెనువెంటన
నీవును రాఁగలవు నీకు నెగు లిం కేలా

అస్మదక్షిద్వయీగళితాశ్రుకణము
లబల ! నీ కెఱిఁగించు నాయరుగుసరణి
లలితలావణ్యముక్తాఫలంబులట్లు
చెలువుగులుకుచు లేఁతపచ్చికబయళ్ళ

అనిన నప్పెంటిగువ్వ దుస్సహ దురంత దుర్దాంత భర్తృమరణవృత్తాంతంబు నాలించి వెనువెంటన

అతిదుఃఖప్రభవంబును
బ్రతిబద్ధేంద్రియము నగుచు భాసిలు మూర్ఛన్

బతిమరణంబుం జూడక
స్మృతిచెడిపడియెఁ గృతోపకృతిచందమునన్
అంత నమ్మగపావురం బిదియ యద నని తలంచి
యతిథిం బొడగాంచి

అన్నా! తోఁచె నుపాయ మొండు భవదీ
యక్షుద్వ్యథన్ దీర్ప నిం
క న్నీ వించుకయుం దలంకకుము నా
కాయంబు నర్పించి యా
పన్నున్ ని న్నలరింప నెంచితిఁ గృపా
భావంబునన్ దీనిఁ గొ
మ్మెన్నండే నిటువంటివంటకము నీ
కేరే సమర్పించిరే

అనిపల్కి

తడయక మండునగ్గికిఁ బ్ర
దక్షిణపూర్వకమైనవందనం
బిడి భవబంధము ల్తెగ నె
కించుక జంకును గొంకు లేక న
లడయును దేఱిచూచి విహ
గంబు గుభాలున మంటలోపలం
బడె వనవృక్షకోటి హిమ
బాష్పకణంబులు విజ్జరాల్పఁగన్



సర్పవల యాబ్జభవ కం
దర్పగురు ప్రముఖదేవతాగణ మబ్రా
బేర్పడ మెచ్చ ఖగం బా
త్మార్పణ మొనరించె నిట్టు లతిథికి నదిరా!

అగ్గిలో నిర్వ్యథిన్ మ్రొగ్గి మగ్గుచున్న
పుల్గుఁ బొడగాంచి విస్మయంబున మునిం
నిట్టనిలుచుండి బోయ నిర్నిమిషదృష్టిఁ
జేష్టలం దక్కి యొక్కింతసేపు గడపి



ఇమ్మెయిసాహసంబు గల
దే! విలసత్కరుణారసార్ద్రచి
త్తమ్మున ని ట్లొసంగునె ప
తంగము స్వాంగ; మహో! విహంగ
ఘమ్మున దీని కీడగు ఖ
గంబు జగంబున నున్నదొక్కొ ని
క్కమ్ముగ నొక్కవేలు పగుఁ
గాక కపోత మనంగఁ జెల్లునే

కటకటా! జ్వలదగ్నిశిఖాకలాప
మెగసి తనకోమలాంగంబు నేర్చుచుండ
నెట్లు సైరించె నాబాధ నీపులుంగు
కొఱలునావేశమున మేను మఱచె నోటు

అగ్గల మైనసీతువున
    సంగము గొంకరవోవ మృత్యువున్
డగ్గఱి యున్నన న్నని హా
    టాహుటిఁ బల్లెకు నేగి ముక్కుతో
నగ్గిని దెచ్చి కోటరము
    నందలి గూఁటిని గాల్చి నాచలిన్
దగ్గనొనర్చి కూర్చెను గ
    దా! ముద మియ్యది నాకు ముందరన్

కట్టా! దీనం దనియక
పెట్టుము నా కన్న మనుచుఁ బీడించితి లేఁ
బిట్టన్ దుట్టతుదకు నా
పొట్టం బెట్టుకొని నీచపుంగతిఁ గంటిన్

లోకు లీకరణిం బ్రాణిలోకమునకు
మేలు గావించుచుండ్రు కాఁబోలు సతము
పుట్టువుం దొట్టి యుపకృతిపొంతఁ బోని
కట్టిఁడిని నేను నా కెట్టిగతులు గలవొ

భగవంతుఁడు న న్నేటికి
జగమునఁ బుట్టించె నాదుజన్మంబునకున్
దగుఫల మెయ్యది యని లో
వగవక నాజీవనమ్ము వ మ్మొనరిచితిన్



ధర్మశాస్త్రజ్ఞు లెల్ల రెద్దానిఁ బరమ
పాతకనిదాన మిది యని పల్కుచుందు
రట్టిహింసయ నావ్రతం బయ్యె నెపుడు
నకట! నాపాప మేనాఁటి కడఁగిపోవు

పొదుగుశుకాంగనన్ జదిపి
    బుట్టను బెట్టితిఁ దల్లిదండ్రులన్
వదలనిగోరువంక మెడ
    వంచితిఁ ద్రుంచితిఁ గుంజసీమలన్
బొదలుకపోతదంపతులఁ
    బొంగుచు నేసితిఁ జూఁడిమోపునన్
గదలనిలేడిపిండుఁ బెఱ
    కల్మషముల్ దడవంగ నేటికిన్

శాకాదుల మెసవి యసం
ఖ్యాకము లగుభూతములు సుఖస్థితిమై నీ
లోకమున శేవొకో యవి
వేకమ్మున నేన యిట్టివెంగలి నైతిన్

ఉత్తమమానవజన్మం
బెత్తియు నేఁ జెడితి జ్ఞానహీనుఁడ నై; లో
కోత్తరచరిత్రఁ బుల్గు బు
ధోత్తంసస్తోత్రమునకు యోగ్యం బయ్యెన్

స్వార్థమును వీడనాడి పరార్థమునకు
నర్థమును మానమును మేని నప్పగించు
పుణ్యమూర్తిచరిత్రంబహో సమస్త
జగతి కాదర్శమై సుప్రశస్తిఁ గాంచు

మంజులంబుగఁ బెక్కుధర్మములు పల్కి
చేతలం దొకఁడే ననుష్ఠింపలేని
వదరుఁబోతుల కిఁక సిగ్గువచ్చుఁ గాత
మేత దల్పకపోతవిఖ్యాతచరిత

క్షుద్రుఁడనై గాఢతమో
నిద్రారతి నున్న నన్ను నిర్వ్యాజకృపా
ముద్రితహృదయంబునఁ గడు
భద్రంబుగ మేలుకొల్పెఁ బక్షి గురుండై

తగుబుద్ధి సెప్పెఁ బావుర
మిఁక మానెద జీవహింస నెడఁబాసెద నీ
చగుణంబులఁ గామంబులఁ
దెగటార్చెద విడుతు సంసృతిన్ బాపగతిన్

గురువుల సేవించెద నీ
శ్వరతత్త్వ మెఱింగెదన్ భవంబులఁ ద్రుంతున్
నిరుపమ నిరుపద్రవ సు
స్థిరతర కైవల్యసౌఖ్యసిద్ధి రహింతున్



అని పెక్కుభంగుల విచారించి యంతరంగంబునఁ
బొంగి పొరలువైరాగ్యభాగ్యంబునం జేసి హింసా
వృత్తమ్ము నెడఁబాసి తుచ్ఛంబు లగువిషయోప
భోగంబుల రోసి తురీయపురుషార్థంబునంద డెం
దంబు పదిలపఱిచి యుండె నయ్యవసరంబున
వలఁ జిక్కి యున్నపుల్గులు
చలిగాలికి నడలి తాళఁజాలక జీవం
బులమీఁదియాస లెల్లం
దొలఁగ విలాపించుచుండె దుర్భరచింతన్
ఆయార్తనాదములు విని
బోయం డెద మివుల జాలి పొంగారఁగ నా
రాయణ! నారాయణ! నా
రాయణ! నాపాప మెక్కరణి రూపడఁగున్
అనుచు నవ్వలం గదిసి
మొలఁగల కత్తి దీసి వల
ముక్కలు ముక్కలు చేసి యుచ్చులన్
బలితము లైనచిక్కములఁ
బట్టి రయంబునఁ గోసి కాల్వలై
జలజల నశ్రుతోయములు
జాల్కొనఁ బుల్గుల నెల్ల నల్లవో!
వెలలిచె నేఁటి కెంతటి వి
వేకము గల్గెఁ గసాయిబోయకున్

అంత నతండు తన కొదవినయెఱుకబలిమిం బార
లౌకికచింతాసాగరనిమగ్నుం డయి యంద నిలువంబడి
యుండెఁ – బదంపడి బంధవిముక్తిం గనినవిహంగంబులు
మెల్లమెల్లన ఱెక్కల నల్లార్చుచుఁ బరిసరతరుశాఖల
నధిరోహించెఁ – బిదప మూర్ఛామగ్నయై యొడ
లెఱుంగక పడియున్నకపోతి యప్పుడ మేల్కొని
యున్మిషితలోచనయై నలువలంకులఁ గలయం దిలకించి
చెలువునిం గానక

జీవితనాయక ! నీ వు
న్నావొకో జీవంబుతోడ ; నాతికి యుష్మ
త్పావనరూపముఁ జూపఁ గ
దే! వల్లభ! యంచు లేచె ధృతి దూరము గన్

లేచి యనలంబుకడ వ్రాలి చూచె నందు
లీన మగుచున్నమగని సుజ్ఞానఖనిని
చూచినంతనె శోకంబు చుట్టుముట్ట
నిట్టు విలపించెఁ గానయు బిట్టు వగవ

వల్లభ! వల్లభ! మంటం
ద్రెళ్లితె యీదీనురాలిది క్కెవ్వరుగా
నుల్లంబునం దలంచితి
చెల్లరె! నీ కింతకఠినచిత్తము తగునే



ఇది భవదధీనజీవిత
గద! దీనిని డించి పోవఁగా నకటా! నీ
హృదయ మెటు లియ్యకొనె నా
కెది తెరు వికఁ జేయుకార్య మెయ్యది నాథా!

నాకడుపు నిండుటకు మును
నీ కుక్షిం జూడ వెపుడు నే నించుక బా
ధాకలిత నైన నోర్వవు
నీకూరిమిపేరిమి న్గణింపఁ దరంబే

లలితలావణ్య పల్లవవితానలతాంత
సముపేతమంజుకుంజములయందు
గ్రావస్రవన్నదీకమలశీకరసిక్త
శీతలాద్రిప్లవశ్రేణులందు
బాలరసాలద్రుజాల కోమలలతా
స్తోమాంచి తారామసీమలందు
సుందరవికచారవిందమందిరదీర్ఘి
కామనోహరతీరభూములందు

నిరుపమవిశుద్ధహర్షవార్నిధితరంగ
డోలికాపంక్తులందు నూయేల లూఁపి
నన్ను మదిఁ దేల్చినట్టి నీనవ్యలీల
మఱతునే నాథ! యెన్నిజన్మముల కైన

పతిమరణానంతర మీ
క్షితి నొక్కనిమేష మేని జీవనయాత్రన్
సతి గడపుట దుస్సాధం
బతిదుష్కర మని యెఱుంగవా హృదయేశా !

కుసుమకోమల మైన నీగోనబుమేను
వీతిహోత్రున కెట్టు లర్పించి తకట !
యతిథిసేవాపరాయణం బైన నీదు
చిత్త మెంతకుఁ బెరరేచె జీవితేశ !

నేన నీకంటెమును మరణింతు నంచు
నాకొఱకుఁ గుందితివి గదా నాథ ! నీవు
తుదకు నాకంటెమును నీవ త్రుంగి తకట !
మొగడియ కేద్ది మూఁడునో యెవ్వఁ డెఱుఁగు

మూర్ఛయం దున్ననన్ను గన్మొఱఁగి యిదియ
సమయ మని యెంచి క్షణభిన్నసౌహృదుండ
వగుచు న న్నిట డించి నీ వమరపురికిఁ
జేరఁ దలఁచితె నీ కిట్టిచేఁత తగునె

"సుదతీ ! నామది నుండె దీ వెపుడు" నం
చున్ మత్ప్రియం బాట కీ
వెది భాషించితి దానిఁ గైతవముఁగా
నే నిప్పు డూహింతు న



య్యది నాథా ! మెఱమెచ్చు గానియెడ నీ
వంగచ్యుతిం జెంద నం
దదె నాదేహ మొకింతభంగము
నహహా ! తర్కంబులింకేటికిన్

అని భర్తృమరణసంజనితదుఃఖాతిరేకంబునఁ బెక్కు
భంగులఁ గొంతతడవు పనవి పనవి పదంపడి యెఱుక
తెఱచు గల దగుటంజేసి నా కింక నెద్ది కర్తవ్య మని
యూహించి తా మున్ను విన్నసతీధర్మంబుల సంస్మరించి

మగని ననుగమించి మరణించునిల్లాలు
పతియుఁ దానుఁ బుణ్యగతుల కేగి
యతులసౌఖ్యపదవి నంది భవంబులఁ
ద్రెంచు నంచు బుధులు దెల్ప విందు

కావున జీవితేశ్వరు నెదుటయ నా కిపు డవశ్యా
చరణీయం బని నిశ్చయించి తేని నుద్దేశించి

నీయొడలిలోన సగపాలు నిలిపి బోయ
కప్పన మ్మొనరింతె శేషాంగ మిట్లు
దీనఁ గల్గునె పూర్ణాతిథేయసుకృత
మతిథి కర్ధాన్న మిడుట న్యాయంబె నాథ !

నీయనుపమవితరణమున
బోయకు నుదయించె సుప్రబోధము దానన్

నాయురులఁ ద్రెంపె నాతఁడు
పోయె దురంతంబు నాదు పుణ్యముకతనన్

సురుచిరనందనవిహారీ
పరిరంభణములకు నీవు పాల్పడుటకు ముం
దరుదెంచి నిన్నుఁ గూడెద
నఱ లేనిమనంబుతోడ ననలాధ్వమునన్

నెలతో వెన్నెల దొలఁగున్
జలదముతో నరుగు మెఱుపు చాసలు తమభ
ర్తల ననుగమించువారని
తెలిపెడిని విచేతనములుఁ దెల్లము గాఁగన్

రమ్యకుసుమంబ వీవు సౌరభమ నేను
నిండునెల వీవు పండువెన్నెలను నేను
పదమవీవు తదర్థసంపదను నేను
కలదె యన్యోన్యవిప్రయోగంబు మనకు

అని పలికి సన్నగిల్లుననలంబు చేరువచిదుగుల నెగఁ
ద్రోచి దరికొల్పి యావేశవికాసహర్షంబులు ముప్పిరి
గొన నిప్పుం జుట్టివచ్చి

ఉల్లమునం గపోతవిభు
నుజ్జ్వలమూర్తిఁ దలంచి నిల్వమో



వల్లభ ! పోకు పోకు మిదె
వచ్చితి వచ్చితి నంచుఁ బల్కుచున్
నల్లవా! మంటలో దుమికి
నాథునిడాపటఁ బవ్వళించి తాఁ
ద్రెళ్ళె జగంబునన్ నిజస
తీత్వము నెల్లరు మెచ్చునట్లుగన్

అంత నగ్గువ్వ జవ్వని

నవ్యప్రభావిభాసుర
దివ్యవిమానంబు నెక్కి దీపించుపతిన్
భవ్యగుణుఁ గూడి సజ్జన
సేవ్యం బగు నాకమునకుఁ జివ్వన నేగెన్

అచ్చట నచ్చర లెదురై
వచ్చిరి స్వాగతము నడిగి వాలినమోదం
బచ్చుపడ నమ్మిథునమున
కిచ్చిరి హారతులు విబుధు లెల్లఁ జెలంగన్

నందనవన హరిచందన
మందారాదికసురద్రుమముల నమందా
నందంబు చింద నప్పులుఁ
గుందోయి సుఖించుచుండెఁ గూరిమిపేర్మిన్

బోయఁ డిట నట్లు చనినకపోతయుగళి
వర్తనమ్మును గాంచి వహ్వా యటంచు
మెచ్చి తానును నట్లుగా నిచ్చగించి
తుచ్ఛదేహాభిమానంబుఁ ద్రుంచివైచి

ఆలుబిడ్డలమీఁదియాసల విడిచి
పోల నైహికబంధముల నెల్లఁ గోసి
యఖిలేంద్రియమ్ముల నాత్మ నడంచి
నిఖిలేశు నెడఁదలో నియతిమై నిల్పి
ముక్తకేశుం డయి మునివృత్తిఁ దాల్చి
ముక్తికాంతాకరమ్మును బట్ట నెంచి
రయమున దుర్గమారణ్యంబు సొచ్చి
పయనమయ్యెను మహాప్రస్థానమునకు

నిడు వాలిక ముండులు తన
యొడలిం గడుఁ జీల్ప నెత్తు రుడుగక నడవన్
దడుపుచు నుండ నతం డది
యెడఁ దడవక నడుచుచుండె నెడలనికడఁకన్

ఇట్టు లయ్యెలుకుజెట్టి యెట్టిబెట్టిదంపుటిక్కట్టుల నేని
సరకుగొనక దీక్షాబలంబున గిరిసరిదరణ్యంబు లనేకం
బులు గడచి పుణ్యభూమి యనునాస నుత్తరాశ
కభిముఖుం డై పోవం బోవ



దావానల మొక్కయెడన్
ద్యావాభూమ్యంతరమ్ము నలమికొని వన
శ్రీ వోవఁగఁ దీండ్రించుచు
నావిమలాత్మునకు బోయ కడ్డం బయ్యెన్

అతఁ డందుల కెంతయు సంతసించి

ఓపరమేశ్వర మత్కృత
పాపంబుల నెల్ల సైఁచి భవసంబంధి
వ్యాపారముఁ బాపఁగదే
నీపాలం బడితి దిక్కు నీవ దయాబ్ధీ !

అని ప్రార్థించుచు నించుక
యనుమానము లేక తద్దవానలమం దో
య్యనచొచ్చి మైఁ దొఱఁగి పా
వనదేవత్వంబు వడసి వన్నియ కెక్కెన్ ౧౯౧

